# కిన్నెరసాని పాటలు



విశ్వనాథ సత్యనారాయణ

# కిన్నెరసాని పాటలు



# కోకిలమ్మ పెండ్లి



విశ్వనాథ సత్యనారాయణ

పబ్లిషర్:

**వి. వరలక్ష్మి**

మారుతీనగర్, విజయవాడ - 2.

౪

# కిన్నెరసాని పాటలు

కల్పన :

కిన్నెర మహాపతివ్రత. అందరు తెలుగుకన్నెలకు వలెనే ఉద్విగ్నహృదయ. ఎక్కువ తెలుగు కుటుంబాలకు సామాన్యమైన అత్తాకోడళ్ళ పోరాటం ఆ యింట్లోనూ వెలిసింది. కొడుకు సుఖ మెరుగని అత్తకు కిన్నెరమీద నింద లారోపించటం పని అయింది. ఒకప్పుడు ఆవిడ చేసిన నింద భరించటం కష్టమైంది. కిన్నెరహృదయం శోకంచేత ప్రళయసముద్రం అయింది. కిన్నెరభర్త ఏంచేస్తాడు? తల్లిని కాదనాలేడు, భార్యను ఓదార్చుకోనూలేడు. ఆవేశహృదయంతో కిన్నెర అడవులవెంట పరుగెత్తింది. భర్త పోయి ఆమెను పట్టుకొని కౌగిలించుకొన్నాడు. ఆమె అతనికౌగిల్లోనే కరిగి నీరై వాగై ప్రవహించింది. అతను శోకించి శోకించి శిల అయినాడు.

వనములను దాటి "వెన్నెల బయలు" దాటి
తోగులను దాటి దుర్గమాద్రులను దాటి
పులుల యడుగుల నడుగులు కలుపుకొనుచు
'రాళ్ళ వాగు' దాటి పథాంతరములు దాటి

అచట కిన్నెరసాని___

నా యాత్మయందు
నిప్పటికి దాని సంగీతమే నదించు...

# కిన్నెరపుట్టుక

ఓహూ కిన్నెరసాని
ఓహూ కిన్నెరసాని
ఊహామాత్రముగోసల
నేలనిలువవే జవరాలా !

కనగిపోతి నిన్నువెల్లను
తరలించితి నాజీవము
మనగిపోయి నాగుండియ
సురిగిపోయెనే ప్రియురాలా – ఓహూ !

తనయెడ తప్పే యున్నది
అరుకోవే నాథునిదెస
వనితలు నీవలె కఠినలు
కనిపించరువే యెందును – ఓహూ !

ఇంత కోప మేమిటికే
యింత పంత మేమిటికే
ఇంతులు జగమున పతులను
నింతలు సేయుదురటవే – ఓహూ!

ఇప్పుడెగదా నాకౌగిట
కప్పితి నీ శోకమూర్తి
అప్పుడే నిలువున నీరై
యెప్పుడు ప్రవహించితివే - ఓహో!

అంత పగే పూనితివో
అంతకోప మొందితివో
ఇంతీ! నను శిక్షింపగ
నింకొక మార్గము లేదటె - ఓహో!

రాలపైన తొలినాళుల
కాలిడగా నోర్వలేవు
రాలను కొండల గుట్టల
నేలా ప్రవహించెదవో - ఓహో!

నీవు మహాపతిశీలవు
కానని నే నంటినటే
అటు లంటిన నాకంఠము
కటారి త్రెంచకపోతిన - ఓహో!

వెన్నెలవలె తెల్లని నీ
సన్నని మేనిపసందులు
కన్నులకును కనిపించెను
చిన్నితరగచాలువోలె - ఓహో!

నీ యొయ్యారపు నడకలు
మాయురె ! కనిపించెను గో
నులకలుగా ప్రవహించిన
సెలయేటి భవన్మూర్తిని - ఓహో !

నీ నవ్వులు నురుగులుగా
నీ వళు లవి తరగలుగా
నీ కన్నులు మీనులుగా
నీకరణిని ప్రవహించెను - ఓహో !

నీ జఘనము నిసుకతిన్నె
గా జూచిన నాకన్నులు
ఊడిపడవు నేలపైన
నురిసిపోవు లోలోనె - ఓహో !

మున్ను భగీరథ భూపతి
వెన్ను వెంట పరుగెత్తిన
అ న్నాకధునీవైఖరి
నున్నది నీ చన్నత్రోవ - ఓహో !

పరుగెత్తెను నీ వేణీ
బంధము పూనితి చేతను
కరమున వేణికి బదులుగ
కాల్వగట్టె నీటిపొరలు - ఓహో !

ఎడమచేత నీకొంగును
ఒడిచిపట్టుకొంటి చెలీ
తడిచేతను కొంగులేక
తడబడితివి ప్రియురాలా ! – ఓహో !

నీ పాపమ్ములు మోచిన
నా ఫాలమ్మున చెమ్మట
ఈ పగిదిని వాగువైన
నీపై ప్రేమము చూపెడి – ఓహో !

నీవే నా జీవితమణి
నీవే నా జీవేశ్వరి
నీవే నా చూడామణి
నీవేనే ప్రియురాలా – ఓహో !

నీవే యిల్లెల్లెప్పో
జీవము లుండునె నాపై
నీవలె నేను ప్రవాహం
బైవచ్చెద రానీవే – ఓహో !

ఈవు రసాకృతి వగుటను
ఈవైఖరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను
పూనుదునె ధునీవైఖరి – ఓహో !

మును పే నీకన్నులు గని
అనుకొంటిని నీవు నదీ
వనితవు మానుషజన్మము
కనినావని మనసులోన – ఓహో !

ఈ తరగల కదలికలో
ఓ తరుణీ! నీకంత
శ్రీ తారుణ్యము తోచగ
పోతివటే పరుగులెత్తి – ఓహో !

నిను కౌగిట నదిమిన నా
తనువుపులక లణగలేదు
కను విప్పితినో లేదో
నిను కానగ లేనైతిని – ఓహో !

ఈ దురదృష్టుడ నే మని
రోదించెద నడవులందు
నీదే నీదే తప్పని
వాదించిన నడవు లెల్ల – ఓహో !

ఇదిగో చేతులను చాచితి
నేడ్చుచుంటి కంఠ మెత్తి
ముదితా ! వినిపించుకొనక
పోతివటే ప్రియురాలా – ఓహో !

నీకై వేఁచి వేఁచి
నా కంఠము సన్నవడెను
నా కన్నులు మందగించె
నా కాయము కొయ్యబారె – ఓహో!

ఈరోదపు గొందలోపల
నా మొదలే నే నెఱుగను
నా యీ దేహ మిదేమో
తాయిపోతె నసుమున్నది – ఓహో!

# కిన్నెర నడకలు

కరిగింది కరిగింది
కరిగింది కరిగింది
కరిగి కిన్నెరసాని వరదలై పారింది
తరుణి కిన్నెరసాని తరకల్లు కట్టింది
పడతి కిన్నెరసాని పరుగుల్లు పెట్టింది

కదిలింది కదిలింది
కదిలింది కదిలింది
కదిలి కిన్నెరసాని వాదుగల్లుపోయింది
సుదతి కిన్నెరసాని సుళ్ళుగా తిరిగింది
ముదిత కిన్నెరసాని నురుసుల్లు గ్రక్కింది

నడిచింది కడరాళ్ళ
గడిచింది పచ్చికల్
తడిసి కిన్నెరసాని సుడులలో మొరసింది
జడిసి కిన్నెరసాని కడలందు వారిసింది
సుడిసి కిన్నెరసాని జడలుగా కట్టింది

కరగగా కరగగా
కాంత కిన్నెరసాని

తరగచాలులమధ్య తళ తళా మెరిసింది
నురుసుపిండులతోడ బిరబిరా నడిచింది
ఇసుకనేలపైన బుసబుసా పొంగింది

కదలగా కదలగా
కాంత కిన్నెరసాని
పసుపుకట్లిన లేళ్ళకదుపులా తోచించి
కదలు తెల్లని పూలనదివోలె కదిలింది
పడలు తెల్లనిత్రాచు పడగలా విరిసింది

నడవగా నడవగా
నాతి కిన్నెరసాని
తొడిమ యూడినపూవుపడతిలా తోచింది
కను సిగ్గుపడు రాచకన్నెలా తోచింది
బెడగుబోయిన రత్నపేటిలా తోచింది

పతి రాయివలె మారి
పడియున్న చోటునే
పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది
ముగుద కిన్నెరసాని వగచెంది తిరిగింది
వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది

తాను నదిగా: నేల
నైనా ననుచు లోన
పూని కిన్నెరసాని పొగిలింది పొగిలింది
ముక్తగీతికవోలె మ్రోగింది మ్రోగింది
ఒకచోట: నిలువలే కురికింది వురికింది

ఏ వుపాయముచేత
నైన మిళ్ళి తాను
మనిసి కిన్నెరసాని నగుదామ యనిపించి
ఆపలేనంత కోరికచేత విలపించి
ముగుద కిన్నెరసాని మొరసింది మొరసింది

తను వీడితే వోర్చు
కొనలేదు కాబోలు
బ్రతికుండగా యింతప్రాయమ్ము కలనంచు
తెలిసితే యింకెంత చెలిమి వుండే నంచు
తలపోసి తలపోసి సొలసె కిన్నెరసాని

అటువంటి పతితోడి
అటువంటి కాపురం
బిటుచేసికొంటినం చెక్కడా లేనంత
వగచెంది వగచెంది వనిత కిన్నెరసాని
వనరింది వనరింది వనిత కిన్నెరసాని

తుద కేమి చేయగా
నెదవోక అలవోక
పతి రాయిగా మారి పడియున్న గుట్టపై
అతివ తన కెరటాలహస్తాలతో చుట్టి
వెతపొంది వెతపొంది బిట్టు ఘోషించింది

మారి మాటికి కొండ
మాద్రిగా పడివున్న
తన నీలికాణి చేతుల కౌగిలిస్తుంది
పలకవా యని ప్రేమోతపడి పలుకరిస్తుంది
పతిగుట్టపై తాను వాలిలియేడుస్తుంది

"ఓ నాథ! ఓ నాథ!
ఓ నాథ! ఓ నాథ!
నాకుమల్లే నీవు నదివోలె పారరా
జలముగా యిద్దరము కలిసి పోదామురా
కెరటాలు కెరటాలు కౌగిలిద్దామురా

ఓ నాథ! ఓ నాథ!
ఓ నాథ! ఓ నాథ!
నీయందు తప్పింక నేను చెయ్యను లేర
ఆనపెట్టితి నేని అడుగుదాటను లేర
ఇక జన్మలో కోప మింత పొందను లేర

రార ! ఓహో నాథ
రార ! ఓహో నాథ
వెలది నీ కిన్నెరా కలగిపోయిందిరా
నాతి నీ కిన్నెరా నలగిపోయిందిరా
పడతి నీ కిన్నెరా బడలిపోయిందిరా

ఓ నాథ ! నీయందు
నేను చేసిన తప్పు
తిరిగి యెప్పటికైన తీర్చుకుంటానురా
నీతోనె నీదిరా నాత్రోన నాదిరా
మరల నాతో నీవు మాటాడబోవురా"

పిలిచింది పిలిచింది
పిలిచింది పిలిచింది
పిలిచి కిన్నెరసాని పిలుచు టాపేసింది
బడలి కిన్నెరసాని పడిపోయినట్లుంది
తరుణి కిన్నెరసాని కేకలు తగ్గింది

వనరింది వనరింది
వనరి కిన్నెరసాని
మండియారిన నిప్పుమాదిరిగా నారింది
తనకర్మ మింతియే యని లోన ననుకుంది
తన కింక పతితోడి తగులు లే దనుకుంది

చేతులారా తాను
చేసుకున్నానని
యింతి కిన్నెరసాని యేడ్చినా యేడ్పులూ
సుదతి కిన్నెరసాని చూపినా దుఃఖమూ
అవికూడ జలములై ఆమెలో కలిసినై

"నీలిమబ్బుల బోలు
నిడివి నీ చేతుల్లు
నన్నింక కౌగిలించగరావు కాబోలు
కడుప్రేమతో చేరగాలేవు కాబోలు
నెమ్మదిగ నాయొడల్ నిమురవు కాబోలు

నేను కోపము నంది
నీ ప్రక్క నుండగా
వలదన్నకొద్ది నా పదము లొత్తుచు నీవు
తలచి కౌగింటిలో తేర్చుకుంటూ నీవు
నాఱొమ్ము తలచేర్చగారావు కాబోలు

తలిరాకువంటి మో
తని గుత్తపెదవితో
తార్చి నామోము నద్దగరావు కాబోలు
నాయొడల్ మివుల సంతపుకుప్ప యని చెప్పి
ఎల్లతావులను ముద్దిడరావు కాబోలు"

అని సన్నగొంతుతో
నసరి కిన్నెరసాని
రొద యడంగిన పావురాయిగొంతుకవోలె
తనలోన తా నేమొ మెలమెల్ల రొదచేసి
కొనుచు పల్లపునేలకును డిగ్గి పడిపోవు

జలదేవతలు వచ్చి
నెలత కిన్నెరసాని
పద మంచు పద మంచు బలవంతపెట్టంగ
మరిమరీ పతిచుట్టు తిరిగి కిన్నెరసాని
వలవలా యేడ్చింది పలపలా కుందింది

జలదేవతలు వచ్చి
చలపెట్ట పతిగుట్ట
విడలేక విడలేక పడతికిన్నెరసాని
చనలేక చనలేక చాన కిన్నెరసాని
పోలేక పోలేక బాల కిన్నెరసాని

జలదేవతలు వచ్చి
చలపెట్ట పతిగుట్ట
వదలగాలేక యాముదిత కిన్నెరసాని
తల్లి దగ్గరనుండి తనమెడకు పలుపోసి
లాగగాబడ్డట్టి లేగలా సాగింది

సాగింది సాగింది
జాలుగా పారింది
ఆవుపొదుగున పాలు ధారకట్టినయట్లు
వనదేవతలు నీళ్ళు వొలకబోసినయట్లు
తల్లి చల్లనిప్రేమ వెల్లివారినయట్లు

జాలుగా పారింది
జలజలా పొంగింది
లేతమొండలు విశాళిని క్రొమ్ముకొన్నట్లు
పాలాట్రిగడము పాతరతీసికొన్నట్లు
ముద్దరాలిమనస్సు పొంగివచ్చిన యట్లు

జలజలా పొంగింది
బిలబిలా నడచింది
పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్నెలా
చిన్నగంతులు వేయు తెల్లనా బెయ్యాలా
పసిపాప సెలవివారిన బోసినవ్వులా

నడిచింది నడిచింది
నడిచి కిన్నెరసాని
నడిచి యందాలు చందాలుగా నడిచింది
గడియలోపల పెద్దకాల్వగా కట్టింది
అడివితోగుల రాణి యన్నట్లు తోచింది

ఏమి కిన్నెరసాని
ఏమి కిన్నెరతోగు
బంగారుతీగలో పానకమ్మై పోయె
కొబ్బరిపాలు వాకలుకట్టికట్టెయ్యో
నెయ్యావు లొకసారి పిదికినట్లైపోయె

జలదేవతల వెంట
సాగి కిన్నెరసాని
తెలితారకలవెంట వెలుగులా తోచింది
తలిరుపూవులవెంట తావిలా తోచింది
తెనుగుపాటలవెంట తీపిలా తోచింది

వయ్యారి నడలతో
వచ్చు కిన్నెరసాని
వనదేవతలు పూలు పై కుమ్మరించారు
భూదేవతలు ఎదురుపోయి దీవించారు
వాయుదేవతలు రమ్మని పాటపాడారు

పాఱు కిన్నెరసాని
పజ్జలందున నిల్చి
కోకిలా తన గొంతుకొన విచ్చి పాడింది
పికిలిపిట్టలు మేలిరకముగా కూసినై
తెలుగుపిట్టలు వాళ్ళు తెలియక పాడినై

ఎంతదూరము పోయె
నంతదూరముదాక
తెలివ కిన్నెర వెన్కతిరిగి చూచుచు పోయె
పడతి కిన్నెర తిరిగి పతి చూచుచునె పోయె
నాతి కిన్నెర తిరిగి నాథు చూచుచె పోయె

పతివంక చూచుచూ
పడతి కిన్నెరసాని
పోయేటివేళలో భూమి తనంతగా
తోరమై విరియుచూ స్రోతగా చేసింది
కెరటాలతో పొచ్చుకోదు కిన్నెరసాని

బ్రతికి వున్నప్పుడూ
అతివ కిన్నెరసాని
ఎంత ఒయ్యారియో, ఎంత నెమ్మదిచానొ
అంత ఒయ్యారమ్ము అడుగడుగుపోయింది
అంత యిల్లాలి నెమ్మదితనము చూపింది

# కిన్నెర నృత్యము

కెరటాలలో నుర్వు
తెరచాలులో నీటి
పొరజాలులో కిన్నె
అటు కదలి యిటు కదలి
చిట్టితరంగాలతో - పొట్టితరంగాలతో
నటనాలు మొదలెట్టెనే - కొన్నెటి
తుటుములా కదలాడెనే

పువుకన్నెలా జగా
రవ నవ్వులా వేల్పు
కవ చిన్నెలా కిన్నె
అటు లూగి యిటు లూగి
చిటులు కెరటాలతో - పెటిలు కెరటాలతో
జవ్వజవ్వన నూగెనే - తెలిమల్లె
పువ్వారుపువ్వులు పోయెనే

చిఱుగాలిలో నూగు
కొఱవంపులో నీటు
తరితీపులో కిన్నె
అటు లేచి యిటు లేచి
జల్లుతుంపురులతో - కొల్లతుంపురులతో

మెల్ల మెల్లన నాడెనే - కెరటాల
జల్లులో ముంచెత్తెనే

నడిసిబ్బెలో మెరిసి
జడసందులో నీటి
ముడిపొందులో కిన్నె
అటు పొంగి యిటు పొంగి
రంగారునలలతో - పొంగారునలలతో
చెంగుచెంగున దూకెనే - క్రొంగొత్త
సింగారములు వొలికెనే

సుడిగాలిలో పొంగు
తరగాలిలో నీటి
తెరజాలులో కిన్నె
అటు పొరలి యిటు పొరలి
పసగొత్తు నురుగుతో - తరు లొత్తు నురుగుతో
గల్లుగల్లున మ్రోగెనే - జల్లు మని
వెల్లువల్ విరజిమ్మెనే

సొనజారుతూ నీటి
పనవాలుతూ అంచ
మున సోలుతూ కిన్నె
అటు చెదరి యిటు చెదరి
చిన్నారినడలతో - పొన్నారినడలతో

వన్నె వన్నెలు పోదానే కిన్నెరా
క్రొన్నెలాతను కొప్పనే

చిటుతేనెలా అచ్చ
రల గొంత్రులా గజ్జ
యల మ్రోతలా కిన్నె
రటు మొరసి యిటు మొరసి
గలగలారవళితో - జలజలారవళితో
మెల్లగా నూగాడెనే - కెరటాల
జల్లుగా ముసురెత్తెనే

తెగపాడుతూ అంద
ముగ నాడుతూ తేనె
వగ లొలుకుతూ కిన్నె
రటు వాలి యిటు వాలి
తళుకువాకలతోడ - తెళుకువాకలతోడ
మలకలై నటియించెనే - తెలినీరి
పులకలై బుగ్గెత్తెనే

లయ పెంచుతూ మధ్య
లయ దించుతూ పాట
రయ మెంచుతూ కిన్నె
రటు పోలి యిటు పోలి
తెలి నీటిమేనితో - తలిరాకు మేనితో

ఒయ్యారములు పోయెనే - కిన్నెరా
అయ్యారె యనిపించెనే

ధణధంగిణాం ధధోం
గిణ తక్కిణాం మద్దె
లలమోగ్రితలై కిన్నె
రటు మోగ్రి యిటు మోగ్రి
చిలువెల్గుపోనలై
నృత్యతాండవము చేసెనే - వనవీధి
పసుపుపాయలు కట్టెనే

ఘలు ఘల్లునా వెల్లు
వల వెల్లునా కొల్ల
వలిజల్లునా కిన్నె
రటు తొక్కి యిటుతొక్కి
గిలుకుటందియలునా - తళుకుటందియలునా
అలల నురుసులు తోచెనే - ఆమధ్య
జలాజలా పొంగత్తెనే

జిగి బెళ్కులా ధగా
ధగ తళ్కులా జగా
జిగికాల్కులా కిన్నె
రటు నవ్వి యిటు నవ్వి
అలల పెన్నురుసుతో - నెలల పెన్నురుసుతో

తెలుగు వాదుగులు పోయెనే - కిన్నెరా
తెలుగు తీపులు చిమ్మెనే

తెలినవ్వులో చెమ్మ
టలు చిమ్ముతూ అలస
టలు కప్పిమ్ముతూ కిన్నె
రటు సాకి యిటు సాకి
చిటుమీను కనులతో - నెత్రిమ మీనుకనులతో
సోగతపములు వోయెనే - లోగొంతు
రాగాలు వెలయించెనే

తమి కోనలో మిటా
రము కప్పుకుతూ నిగా
రము లోలుకుతూ కిన్నె
రటు లెగిరి యిటు లెగిరి
ననమేని వంపుతో - నునుమేని ముంపుతో
కాలిగజ్జెలు మోగెనే - జల్లు మని
కాలి కెరటాల్ చిందెనే

అల కోనలో మంచు
వలి సోనలో వెల్లు
వల వాలలో కిన్నె
రటు లోడి యిటు లోడి
రస మేలు రూపుతో - పసమేలు రూపుతో

సొగసువంపులు వంగెనే - వెన్నెలా
చిగురు మంపులు నూపెనే

తలి రోయ్పుతో నీటి
యలలూప్పుతో అంద
ముల మూర్పుతో కిన్నె
రటు సాగి యిటు సాగి
బిగువుటందాలతో - నగవుటందాలతో
విందుగా ప్రవహించెనే - పుప్వల్ల
చెందులా చెలు వొలికెనే

చిటురాలపై మిట్టు
లగు నేలపై మెట్టు
లగు చేలపై కిన్నె
రటు దూకి యిటు దూకి
గ్రక్కదలు నీటితో - చిక్కనగు నీటితో
నీటి గుబురులు కట్టెనే - విరిపూల
తోటలా తళు క్కొత్తెనే

తెరల పొర్లుతో యీగి
కొను మర్లుతో తిరి
పదు దొర్లుతో కిన్నె
రటు తరలి యిటు తరలి
పావురా మెలుగుతో - తీవలా మెలుగుతో

ఒత్తుకొని తాగొప్పనే - తనగల్లు
ఒత్తిల్లి తటమెుత్తెనే

అడవిలో చిటుపాయ
లై వాకలై పోన
లై జాలులై కిన్నె
ఏటి పాకి యేటి పాకి
దివ్యనృత్యములతో - దివ్యనిస్వనముతో
దిగ్గంతము లంటెనే - సురనదీ
దీప్తి దిక్కుల చిమ్మెనే

జిలుగు టందియలతో
కులుకు కొన్నడలతో
వెలది కిన్నెరసాని
పలుతోవలుగ బోయి
తెలిపూల తేనెవాకలు వారగాచేసి
తెనుగువాగై పారెనే - నెత్తావి
తెనుగుపాటలు పాడెనే

# కిన్నెర సంగీతము

కోనలన్నీ ముంచుకొనివచ్చు సెలయేటి
చాన కిన్నెరసాని జలజలా స్రవియించు
తరగలో, పై కెగయు
నురుగులో, క్రొంగ్రొత్త
తేనెకాలున లూరెనో — అమృతంపు
వాన చినుకులు జారెనో

తేనెతొంగల పిండుతోన జలజల సాగు
చాన కిన్నెరసాని జాలైన మేలైన
నాకలో, అందాల
రాకలో, బంగారు
జిలుగు గంటలు మ్రోగెనో — చిన్నారి
బిగువు నవ్వుల సాగెనో

తేనెలై కలకండ సోనలై వానలై
చానకిన్నెరపాట సాగులాడుట మాని
చివరలో, చివురొత్తు
సవురులో, క్రొమ్మావి
వింతగా సిగ్గందెనో — కోకిలా
గొంతులో కద లాడెనో

చెఱకుపానక మెత్తి జీరపాకముపోలె
తరుణి కిన్నెరపాట తారు లాడుట చూచి
పువ్వులో, లేసంజ
రువ్వులో, దానిమ్మ
తెల తెల్లనయి పోయెనో - గొరింజిలక
పలుకులో పస దప్పెనో

పొద్దుకాకల జారిపోవు మంచుమరుఁపోలె
పొలతి కిన్నెరపాట పొంగిపోవుట చూచి
సీటిలో, కిన్నెరా
పాటిలో, అడవిలో
తోగుల్లు పారాడెనో - క్రొంజలువ
వాగుల్లు సాగాడెనో

పికిలి పిట్టల యీలలకు క్రొత్తసొంపగా
సకియ కిన్నెరపాట జరగు లాడుట చూచి
సాములో, చిఱువెచ్చ
జాములో, మెల్లగా
పగలు పులకలు పొంచెనో - మాల్లెలా
సొగసు వెలుగులు చిందెనో

తొలివెన్నెల చివుళ్ళ తెలినిగ్గు విరజిమ్మి
వెలది కిన్నెరపాట విరిసిపోవుట చూచి
తెలుపులో, వెన్నెలా

మలుపులో, రేచాన
సిరివెల్లి. పచరించెనో - విరిపూల
నెరతావి తర మెంచెనో

తలిరాకుకన్న మెత్తని యందమునుబోవు
వారుణి కిన్నెరపాట తాన మందుట చూచి
ఎడదలో, ఆనంద
జలధిలో, లోకాలు
పులకితమ్ములైపోయెనో - రసవార్ధి
చులుకితమ్ములై పోయెనో

చిలుత తంగేటిజుంటి జీబు చిక్కనవోని
చిన్ని కిన్నెరపాట జీరసాగుట చూచి
పూలలో, తేనెల
చాలులో, కొల్లిందేల్లు
కదలు లాడుట మానెనో - వాకపై
పసుపులై పసవెత్తెనో

ఒకసారి సన్నగా ఒకసారి విన్నగా
ఉవిద కిన్నెరపాట వయ్యారములు చూచి
కళ్ళలో లేపచ్చ
నుళ్ళలో, పసిలేళ్లు
బెదరుచూపులు చూచెనో - మైనిగల్
నడపుగా కనుపించెనో

అంచ కన్నియమొగ్గలు అడవి సాగినయట్లు
అతివ కిన్నెరపాట అతిసన్నగిలి పోవ
పొరలలో; సనసన్న
తెరలలో, చిఱుగాలి
యూసాట సాగించెనో – ఉయ్యాల
తోపాటు వూగించెనో

అందకత్తెల జల్గుటందె మ్రోగిసినయట్లు
చింది కిన్నెరపాట జిలుగుల్లుపోవగా
కూతలో, లేతమ్మి
మేతలో, రాయంచ
లొండొంటి ప్రేమించెనో – సింగార
ముండి కలయిక పొందెనో

ఏటి కిన్నెర పాట ఎగిరెగిరి మిన్నంది
సాటి తారలనడుమ చాలుగా నిగవొందు
దవ్వులో, జాబిల్లి
నవ్వులో, క్రొక్కారు
తలిరుపూవులు చిమ్మెనో – చొక్కంపు
తెలుగు వెలుగులు క్రిమ్మెనో

కంచు గీసినయట్లు కదలు తరగలతోన
మించె కిన్నెరపాట మేలిపోకలు పోవు
నిగ్గులో, అందంపు

జగంలో, నవమొల్ల
ఒక పాటయ్యై పోయెనో – తనుదాన
మెఱుగవేకే పోయెనో

ముద్దు ముద్దుగ నడచి ప్రోడవోలిక నాడి
మురిపమ్ముగా పాడి ముగుద కిన్నెరసాని
యెడదలో, ఎవ్వరైన
బెడదలో, కష్టాల
కడలినో కల గాంచెనో – కన్నీటి
కడవలే ప్రవహించెనో

# కడలి పొంగు

గాలిపిల్ల తె పోయి పూచేనో
మొగిలు కన్నెలు పోయి చెప్పెనో
తగని కోరిక చేత తనలో కడలిరాజు
సొగసు కిన్నెరసారి చూడాలె ననిపించి
ఉల్లిపిట్ట లూగెనూ
మిణ్ణక్కి చూచెనూ

మిస మిసని మింటికై పొంగెనూ
మసక మసకల కళ్ళు విప్పెనూ
ఎంత దూరాన నుందో యీ చిన్ని పడుచంచు
సంతోసమే మేను సకలమ్ముగా మారి
మిరిమిట్రి చూచెనూ
బాటవ్రేళ్ళ నిలచెనూ

ఉబికి కెరటాలూగులాడెనూ
గుబురులై ఉప్పొంగిపోయెనూ
తన మొదటలన కేమొ తెలియ నట్లయిపోయి
తరుణి కిన్నెర అందమే లోక మయిపోయి
సళపెళా కాగెనూ
గల గలా వూగెనూ

తన నీటిగుణ మెంతు పోయెనో
తన చల్లదన మెంతు దాగెనో
పగగ తనలో నున్న బడబాగ్నిశిఖ పొంగి
తన శరీర మెల్ల దహియించి నట్లుగా
తటపటయి పోయెనూ
తపియించి పోయెనూ

గంగ తన యిల్లాలు కాదటే
యమున తన యిల్లాలు కాదటే
ఎంతమంది లేరు ఇన్ని యేళ్లూ నచ్చి
చిన్ని వాగును చూచి చిత్త మెరియించుకో
తనకు నిది తగదూ
కడలిరాజునకూ

ఏ నాటి ముసలి యీ కడలీ
ఏ నాటి పెద్ద యీ కడలీ
తిరిగి నలుగురిలోన తిరుగ నేర్చినవాడు
పరగ కామమునకై బడలిపోయె నటన్న
తన కేమి పరువూ
కడలి రాజునకూ

తన కున్న మర్యాద యెంతా
తన కున్న గౌరవం బెంతా
లోకాలు తప్పుత్రోవల పోవునాయేని

సర్ది చెప్పగలట్టి సామంతుడీ రాజు
తానుగా దిగెనా
తప్పుదారులకూ

అన్ని వాగులవంటి దగునా
అన్ని తోగులవంటి దగునా
మంచి కిన్నెరసాని మగని కక్కసపాన
కొంచె మేమో పొంది కోప మెట్లయినంత
తన్ను పొంగునటే
తనను దక్కునటే

వాగుగా తా నెప్పుడైనదో
తోగుగా తా నెప్పుడైనదో
జల జలా స్రవియించి బిలబిలా ప్రవహించి
కడలిరాజు హారంగు కౌగింటిలో దూకు
ఎప్పుడే వ్రాసినదీ
అన్నివాగులకూ

అని పొంగిపోయెనూ కడలి
అని వాగులాడెనూ కడలి
తనపైన తారాడు పడవ లల్లల నాడి
వచ్చె నంచు తుపాను భయ మందికుందగా
తెరచాప లూగా
కెరటాలు క్రిమ్మా

కెరటాలు పొంగినా కడలీ
తరగ లూగాడినా కడలీ
సొగసు కెన్నెరసాని చూపందుకొనుటకై
గగనమ్ము కొసదాక కెరటాలు పుబికించి
దూరాలు చూచెనూ
బారలూ చాచెనూ

పొంగిపోయిన కడలి చూడి
మిన్ను ముట్టిన కడలి చూడీ
ఈ అకాలపు వేళ యేమో కడలి పొంగి
పోయెనో లోకాలు ముంచివేయునో అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

ఊగులాడిన కడలి చూడి
ఉబికిపోయిన కడలి చూడి
ఉప్పు పెనగా వచ్చి ఉర్వి అంతా పొంగి
తెప్పలై నేలపై తేలియాడునో అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

అడుగడుగో బాడబము పొంగే
అడుగడుగో నేలపై వచ్చె
అని మానిసులు పిరికితనముగా చెప్పుకొని

మేనిలో ప్రాణాలు బిగియగా పట్టుకొని
కదలిపోయి రహాలో – ఒక రోంకరి
వదలిపోవ రహాలో

వచ్చె వచ్చె నట్టన్న కడలి
పొంగె పొంగె నటన్న కడలీ
ఎంత చూచినను అల్లే నిలిచిపోవగా
ఎంతసేపటికి అల్లే నిలిచి ఉండగా
పిరకతగ్గినదీ
జగములన్నిటికీ

ఎట్లు పొంగిన దట్లు పొంగీ
ఎట్లు నిల్చిన దట్లు నిల్చి
ఒకనీటిబొట్టయిన ఊరలి నేలను రాక
కడలి అచ్చోటనే కదలకుండుట చూచి
పిరకపోయినదీ
కొంతసేపటికీ

కడలి పొంగిన దంతేకాని
కడలి ఉబికిన దంతేకాని
కడలి తా చెలియలికట్ట దాటెనె యంచు
కడలిమాత్రము బద్దె గడచిపోవునె యంచు
కడగి యనుకొనిరీ
బుమతమానిసులూ

అన్ని విధముల లోక మాడెనూ
అన్ని రీతుల జగము చెప్పెనూ
చిన్ని కిన్నెరసాని చిత్తాన పొగ లెగయు
కొన్నిన్ని వ్పాకలులోన కుమిలించి దహియించు
ఎవ్వ రెఱుగుదురూ
సవ్వేటి జనులుగా

కడలి మిన్నుల తాను చూచీ
కడలి తనగలవ్వాగు చూచీ
కడలి తనకోసమై బడలుపడిపోవు నని
కడలి తనపై వలపు కమ్ముకొనివచ్చె నని
కిన్నె రెరిగినదీ
కీడు నలచినదీ

మనసులో పెద్దదిగు లుట్టీ
ఎదలోన పెద్దవగ పుట్టీ
కడలిపోయెడినీరు గడకట్టించుకో
సాగిపోయెడినీరు సాగ కింకించుకో
బిట్టు కోరినదీ
బెట్టు కుందినదీ

ఓ నాథ నిను వీడి వచ్చి
ఓ రాజ నిను వీడి వచ్చి
నా యొడల్నయితమ్ము నానాజనులు కోర

యీ దేవపుంబ్రిగు కేల పొందితినిరా
అంచు వగచినదీ
అంచు ఉలికినదీ

అచటనే నిలిచిపో నెంచూ
అచటనే ఆగిపో నెంచూ
కాని నీటిగుణమ్ము కదలిపోవునేగాని
చాన కిన్నెరకోర్కి సాగించునే తాను
జలజలా కదలీ
బిలబిలా కదలీ

రాయడ్డముగ చేసి నిలుచూ
పొదలడ్డముగ చేసి యాగూ
ఇంత నిల్చితి నంచు నెంచి లో నుప్పొంగి
పొంత పొంతలరాళ్ళు పొదలు పైపై పొంగి
అడవి పరుగెత్తూ
అంతలో నేడ్చూ

# కిన్నెర దుఃఖము

హా యని కిన్నెర యేడ్చెన్
తనమనోహరుడు శిలయైనా డని
తా నేమో యీవాగైనా నని
హా యని యేడ్చెన్

ఊగులాడు కెరటాల నాపుకొన
సాగులాడు తరగల్లు నిల్పుకొన
పొంగిపోవు తనగుణము చంపుకొన
చాలక చాలక చాలక చాలక

హా యని

తనతొందరయును తనపతిప్రేమయు
తాను చేసినా తెలివితక్కువయు
తనపతి చూపిన త్యాగగౌరవము
తలచుకు తలచుకు బోరున బోరున

హా యని

ఏడుపునిప్పక తెగసి చిమ్ముకుని
ఏటినీరముల నెండగట్టుకుని
చేటు తప్పిపోయేటిరీతిగా
బాట యేల కనరాదని రాదని

హా యని

చుక్కనైతే యీబెడద తప్పునే
మొక్కనైతే యీవగపు తప్పునే
అక్కట నా చెలువునివేస జేసిన
యిక్కలుషము నే దాఁచు టెట్లని

హా యని

కడలి శోకములు నేలేరాజట
కడలి ధర్మములు నిలిపేదొరయట
కడు పతివ్రతల కనయ మెంచుటలు
కడలికి తగునా తగునా యిట్లని

హా యని

అతడు మంచివాడే యగునేమో
సతి వాగై ప్రవహించిన దంచన
అతనికోసమే అయిన దటంచును
మతి తలపోయుట తప్పెట్లగు నని

హా యని

ఏడ్చిఏడ్చి జల మొల్ల నెరసినయి
ఏడ్చిఏడ్చి తనువెల్ల సల్లనయి
ఏడ్చిఏడ్చి నునుసుల్లు తెల్లనయి
ఏడ్చిఏడ్చి నడకల్లు వేగమయి

హా యని

బొట్లు బొట్లు కొక వేయి ముత్యాలుగా
తరగ తరగ కొక వేయినోళ్ళుగా
బడలి నీరమే యేడుపునయమై
కడలిమ్రోత లెక్కడు భయ మీడగా

హా యని

గాలిపొరలలో కదలాడినవో
అడవిచెట్లలో ఒరగారినవో
వెలుగుదారులను విచ్చిచొచ్చినవో
కిన్నెరయేడుపు సన్ననిమెలుగులు

హా యని

కిన్నెరయేడుపు సన్ననిమెలుగులు
విన్న యడవిలో చిన్నపులుగుగమి
కిన్నెరతో పాటుగ గొంతులలో సన
సన్ననియేడ్పులు జాలువార్చగా

హా యని

శిలయైనపతిం దలచినగాలులు
మెలమెల్లగ తన తరగల నూగగ
చలచల్లన ప్రాణములు తేరగ
తలచిన కొలంది దుఃఖము పొంగగ

హా యని

కొత్తవాగు పరతెంచి వచ్చె నని
కొత్తతోగు పరతెంచి వచ్చె నని
కొత్త కొత్త యా పాలనీరములు
క్రోలగవచ్చినపులులు దిగుల్పడ

హా యని

ఎక్కడెక్కడి మృగములు వచ్చెను
ఎక్కడెక్కడి పులుగులు వచ్చెను
ఎక్కడెక్కడి గాలులు వచ్చెను
కిన్నెర నోదార్పుటకై పాపము

హా యని

కిన్నెరయేడుపు చూచి పులుగులూ
కిన్నెరదుఃఖము చూచి మృగములూ
కిన్నెరయేడుపు చూచి గాలులూ
ఓదార్పగలే కవియు నేడ్చెనూ

హా యని

చూడవచ్చినాలేడి, కిన్నెరా
గాడిచారినా యెడదలోపలా
వాడి వాడి లేజివురు వత్తలై
బేడిసకన్నులనీరము వెట్టగ

హా యని

ఒడ్డునందు కుందేటికూన లవి
చిన్న చెవులు తెగనిక్కపొడుచుకొని
ముందుకాళ్ళు లింపొంద నెత్తి ఢా
దాక్చలేక తెలతెల్లవోవగా

హా యని

గూళ్ళలోన తమ పిల్లల వదలెను
మేతకొరకు పోవా లని మానెను
అడవిపులుగు పిల్లల చేరుకుని
అడవివాగు నోదాక్చవచ్చెనూ

హా యని

పికిలి పిట్లాలూ అడవి పిచ్చికలు
నీటిపులుగులూ నేలపులుగులూ
తెగగుమికట్లిన తెలుగు పిట్లలు
దొకటి యేడ్చి మఱియొకటి యేడ్వగా

హా యని

కిన్నెర మేనుపు సన్నని మెలుగులు
మిన్ను మన్ను నడి మెడము నెడమునా
చిన్ని వెలుగులో పిన్నగాలిలో
సన్న సన్నగా జాలువారగా

హా యని

చిన్ని కిన్నెరా సన్నని ఘొలుగులు
పిన్నగాలి కెరటాల చొచ్చునా
ఎన్నడో వెనుకటి బ్రతుకున మిక్కిలి
విన్నవాటివలె విరవిరబోవును

హా యని

చిన్ని కిన్నెరా సన్ననియొలుగులు
చిన్ని చెల్ల క్రొంజివురు లంటునా
ఎన్న నందనముగున్న మావులం
దున్న తుమ్మెదలరొదవలె మొగయును

హా యని

పడతి కిన్నెరా స్రన్నని యొలుగులు
అడవిసన్నికలయందున ప్రాకును
అడవి పావురా యెడబాటగ్గికి
గుడగుడ గొంతున కూసినయట్లగు

హా యని

అల్ల నల్ల కిన్నెర యేహపు లవి
వెల్లివిరిసి గోదావరి కెరటము
లల్లలాడు నా నడిమిసందులో
మెల్లగ దూరెను మొగ లిమపోలిక

హా యని

అల్లనల్ల కిన్నెరయేడుపు లవి
మెల్లమెల్ల గోదావరిగర్భము
వెల్లిలోన వారబారి మొత్తుకొని
గొల్లు మనుచు మొరపెట్టుకొన్నయని

హా యని

గోదావరి యీవార్త విన్నదీ
గోదావరినది గుండె కరిగినది
గోదావరినది జాలి పొందినది
గోదావరి కన్నీరు కార్చినది

హా యని

గోదావరినది పొంగివచ్చినది
గోదావరి తా నభయ మిచ్చినది
గోదావరి కెరటాలు చాచినది
గోదావరి నమ్మన్నది కిన్నెర

హా యని

కిన్నెర ఎదలో పొంగిపోయినది
కిన్నెర ఎదలో తాండవించినది
కిన్నెర మరి కన్నీరు కార్చినది
కిన్నెర తనకత చెప్పుకున్నదీ

హా యని

కిన్నెర తన కెరటాలు తగ్గిపని
కిన్నెర తన యూగిసల నాపినది
కిన్నెర గోదావరి కెరటాలకు
చిన్నియలలు తా నంది యిచ్చినది

హా యని

# గోదావరీ సంగమము

గోదావరీదేవి గుండె జలజలలాడి
ఆడగొని మనసు కదలాడి జాలి
పాదులో పెల్లగిలి ప్రాకి కిన్నెరా
గేదంగి తెల్లరేకత్తు క్రొత్త తగలలో
చాదుకొని పెనుతాంగ లాగే ఆవాగు
సాదుకొని యాంమెవగ పాగే

గోదావరీ జాలిగుండె గూడులు కదలి
సాదుకిన్నెర కెదురుపోయి ఆమె
లోదిగులు తరగ చేదోయి వారించి
ఆదరముచే నామె నదిమి కౌగిట బూని
ఏది నీ మొగము నాతల్లీ అన్నదీ
నీ దిగులు నిక మాను చెల్లీ

గోదావరీ పేదగుండె లోతులు కలగి
రా దగ్గరకు రమ్మా తల్లీ ఎంత
సాదువే నా ముద్దుచెల్లీ నీ వెన్ని
రాదగని కష్టాలరాశి క్రగ్గితి వమ్మ
నీదుపతి శిలరూపు పొందీ నీ వేమొ
ఓదె పనవాగుగా చిందీ

గోదావరీ జాలిగుండె ప్రేగులు తడిసి
నీ దుఃఖ మెంతదో తల్లీ    నన్ను
నాదరువుగా నమ్ము చెల్లీ    నిను చూచి
పేదలై లోకాలు పెద్దలై నేతేసి
జోదులే మతిచెడిరి తల్లీ    నీ యేడ్పు
రోదసిని నిండినది చెల్లీ.

గోదావరీ మొడవకోసలను కోతపడి
రా దగ్గరకు రమ్ము తల్లీ    కడలి
జో దింక నిను కనదు చెల్లీ    నాతల్లి
నాదు గర్భమున ని న్నాదుకుని ఉంటాను
నీదు నెగులునుపోవ చూచూ    కడలి
నీదు జోలికి నింక రాదూ

గోదావరీదేవి కొసమనసులో నోరసి
పది ని యొడలు నా తల్లీ    చేర్చు
నాదు కౌగింటిలో చెల్లీ    తల్లి నీ
లేదలిపు కెరటాలు నాగుకాల్వల నింతు
నీదుబొట్టును కడలి కనదూ    నాతల్లి
నీదుసంగతి కడలి వినదూ

గోదావరీమహాకూలంకసామృత
శ్రీదివ్యమధుతరంగాలూ    చిన్న
సాదుకిన్నెరతరంగాలూ    కలసికొని

జోడిదిగాను గంగాసరస్వతుల నీరములు
చాదుకొను తళుకు లుంగలించే  మాతగా
సైదోడుతనము మెరిపించే

గోదావరీదేవి కొస తమమను తైవముల
మాదిరి నెలంగు కెరటాలూ  చిన్ని
సాదు కిన్నెర తరంగాలూ  కలసికొని
లేదళుకు వెన్నెలలలో తలిరుమల్లికల
మూదలించినయట్లు వాలిచే  అవ్వాని
పాదలించినయట్లు వలచే

గోదావరీదేవి కోరగించే మొగలి
నాదర హారంగు కెరటాలూ  చిన్ని
సాదుకిన్నెర తరంగాలూ  కలసికొని
గోదుమలవన్నె తెలికొత్త మబ్బులజంట
ఊది కలసిన యట్లు పొలిచే  అందాల
గాదిలికవుంగిళులు సులచే

గోదావరీదేవి కోలుమసగే సన్న
నాదు సేసే తరంగాలూ  చిన్ని
సాదుకిన్నెర తరంగాలూ  కలసికొని
వీధిలో పెద్దక్క పిన్నక్క నవ్వుల్ల
బోచె లాదిగినయట్లు పొలిచే  రతనాల
బొదు లుంచినయట్లు పొలిచే

గోదావరీదేవి గునిసియాడే మీను
లీలలాడే తరంగాలూ చిన్న
సాదుకిన్నెర తరంగాలూ కలసికొని
మీది వృక్ష్యాలలో మిసమిసను పసిపాప
మాదిరిగ కలసికొని వాలిచే నునుకాంతి
మేదురములై వెలుగు మెలిచే

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
సాది తరంలో కలుపుకొనెనూ నీటి
పాములో గ్రుచ్చెత్తుకొనెనూ ప్రేమతో
నాదేవి ప్రవాహమోదాన కెరటాలు
సాదు సీమను కూడుకొనిరి కోమలాం
భోదములనలె మొసుకొనిరి

గోదావరీదేవి కోరికిన్నెరసాని
సాది తనలో కల్పుకోగా కడలి
పాదుకోరిక పెల్లగిలగా కోపాన
ఆ దేవి నడలించ నాంలోచనము చేయు
కాదంచు మదిలోన నెంచూ మనసులో
వాదించు రంగు చేసు కంచూ

గోదావరీదేవి గొప్ప నగరపురాణి
కాదనేందుకు వీలులేదు ఆమె
కాదన్నపని సేయుగాదూ అందులో

ఏది తనదేశ న్యాయ మే దారి నా దేవి
కా దన్న పని మంచి దనునూ   లోకాలు
వాదించితే మెప్పు గనునూ

గోదావరీదేవి గొప్పగుణములు చూచ
వాడుపొందేపదుల రాదూ   న్యాయ
మే దారి విడి యెంచు పోదూ   అందులో
ఆ దేవి మున్ను సీతారాము లొకరొకరి
నేదుకొను నెడబాలు నెరుగా   పసుపు క
ట్లాములకు సుడిగోన పసుగూ

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
సాది తనలో కలుపుకొన్నా   కడలి
యేది చేయగలేక యున్నా   అందరూ
ఓ దొరా! నీ కిట్లు లీ దిగులు కాదయూ
కాదు పతిభక్తలను కోరా   ఆ వాగు
పేదరా లది నీకు నేరా

గోదావరీదేవి కొనుస పబుషుల బి
డ్డాదివాహిని తప్పుకోదూ   తప్పు
నేదునే గాని కైకోదూ   నీవు సి
గ్గేది కోపింతువా యే మొగముపెట్టుకొని
పోదు వా దేవికడ కింకా   ఏ రీతి
నా దేవికొలది మాన్తు వింకా

గోదావరీదేవిగూడ కిన్నెరసాని
సైదోడుగా మారినంతా కోర్కె
కేదారి మాయమయినంతా తనపొంగు
మైదించుకొని కదలి రోదించుకొని కదలి
మీదిపొంగు కుదించుకొనెనూ లోలోన
నామగా తెగ మొరసికొనెనూ

గోదావరినీరు కూడి కిన్నెరనీరు
ఏది యేదో తెలియనంతా కోర్కె
కేదారి మాయమయినంతా తొల్లింటి
సాదురూపము బొంది సాగి చెలియలికట్ట
కేదో మెలమెల్లగా చెప్పూ పడవలను
పోదారిగా నీర మొప్పూ

గోదావరీదేవి కూడి కిన్నెరసాని
యేదిగులు లేక తెలివొందే చల్ల
సాదుతరగల గుములుదిందే మనిసిగా
నేదారినో చచ్చుటేగదా మరి యిప్పుడు
లేదు చావో తనకు నైనా అనుకుంది
లేదు చావును మగని కైనా

# కిన్నెర వైభవము

తూర్పులో తెల్లనై తోచిన ఉషఃకాంత
తొలిమావిలేబూత దూసెను పికీకాంత
తలలపై రతనాలు తళతళా మెరిసేటి
నల్లతామ్రములు దూకి నాట్యమాడేటట్లు
మొగసింది కిన్నెరా ఒడ్డుంబు
ఒరిసింది కిన్నెరా

పొంచున్న తెలివాండ పొడిచింది క్రొంబొద్దు
మేల్కొను మొగాలతో మొలంగిన దడవిసద్దు
పసపుబట్టలు ఆరపట్టగా నేలపై
గాలి లేబొకలలో కదలు లాడినయట్లు
కదలింది కిన్నెరా కాంతితో
మెసలింది కిన్నెరా

పొద్దెక్కి గాలిలో పుట్టింది చిఱువెట్ట
పొదల బుర్రుమని కూసింది కోమటిపిట్ట
రేలచెట్టాకల్ల రాలి క్రొత్తచివుళ్లు
తొడిగి లేమొండలతోన దూకినయట్లు
పొలిచింది కిన్నెరా తెలుపుల్లు
మలచింది కిన్నెరా

జాము జామున్నర సాగెను చదల పొద్దు
నెమలికూతలతోడ నిండిన దడనిసద్దు
తరగ విరిగినచోట తరణికాంతులుప్రబ్బ
గాజుముక్కలు సూర్యకాంతి నిండినయట్లు
పొదలింది కిన్నెరా అందాలు
వదలింది కిన్నెరా

మిగుల తా నడిమింట మోగిసిమండెను తోజి
నెగడె కాంతారమ్ము నిశ్శబ్ద మగు కరణి
మరకతమ్ములు నేల పగచగా పడ్డట్లు
పొరుటాకులమీద పసిమి యూదినయట్లు
నడచింది కిన్నెరా సొగసుల్లు
ముడిచింది కిన్నెరా

మూడుజాముల పొద్దు మొగి జారినది మింట
వెనుకపట్టెను తమ్మివిరి మేల్వలపుపంట
కళ్ళమ్ముతుడిచి పండిన గోధుమలకుప్ప
తూర్పుగాలులకు తూర్పారపట్టినయట్లు
జారింది కిన్నెరా పైడిగా
మారింది కిన్నెరా

మూరగా బారగా పొద్దు వాటారింది
పొలము పిచ్చికగుంపు పుగుగుమే తేరింది
అడవి చెట్లులనీడ లవఘళించిన నీరు

నలుపుతిరిగిన పైరు నాట్యమాడినయట్లు
తరలింది కిన్నెరా     తరగల్లు
ఉరలింది కిన్నెరా

కొండ దగ్గిరసగా వ్రింకించి ముదిపొద్దు
మింట వచ్చేచు పిట్టగముల రెక్కలసద్దు
అడవింగో బోయ వేటాడిపట్టి మృగాల
తోడుసలా బడి నల్లతోగు వారినయట్లు
నడచింది కిన్నెరా     వంగుల్లు
ముడిచింది కిన్నెరా

నల్లగా రేచాన నడచింది తొలిజాము
గొల్లుగా బొబ్బలిడె క్రొల్లుపులుల్ పెనుదీము
దొడ్డవారముంగిళ్ళ తోరణాలుగ వ్రేలు
హరినీలమణులకాంతులు ప్రబ్బినట్లుగా
మారింది కిన్నెరా     ఊటలై
ఊరింది కిన్నెరా

నడిరేయి నల్లనై నాట్యమాడిన యడవి
విడిపులుల్ మృగముల వెదకి చంపెను టడవి
పిరునాగునో యేమొ సిరు కన్పడరాక
తరగ సవ్వడిమాత్రె గురుతుపట్టెడునట్లు
పోయింది కిన్నెరా     నలుపులా
చే యంది కిన్నెరా

శుక్లపక్షము వచ్చె చూచుచుండగ నింట
శోభిల్లె చిన్నిజాబిల్లి తారకలజంట
తెచ్చి మణులుగ ఛాదీనుండి కంసాల
మూసలో కనగించి పోసినయట్లుగా
ఆడింది కిన్నెరా తళతళ
లాడింది కిన్నెరా

తలిరాకుతుద దక్కి-తానను వసంతమ్ము
కోకి లార్చెను నెమలికూతలకు పంతమ్ము
మగనిపై కెడబాటు పొగల సగమయిపోయి
బహు సన్నగిలిపోయి పాలిపోయిన మేన
మెరసింది కిన్నెరా ఎదలోన
మెరసింది కిన్నెరా

ఎడనీరు కాల్వలై యేరులై పోవులై
నడి మృగమ్ములు దప్పికలు తీర్చుకొనురీతి
సాగింది కిన్నెరా బూదిరం
గూదింది కిన్నెరా

మండుటెండలు గాసి మాడ్చినది గ్రీష్మమ్ము
కొండయంచులనుండి కురిసినది ఊష్మమ్ము
నీటిపుట్టము తొలగి నిలువెల్ల నిప్పులో
మేటియిసకలు మండి మొసగిపడిపోవగా
పడ్చింది కిన్నెరా తనువెల్ల
మాడ్చింది కిన్నెరా

అడవిలో చిఱుపూటయట్లుగా కదలాడి
పాలలో కలిపిన పంచదారవిధాన
రుచి పెంచె కిన్నెరా సితమణి
చ్ఛవి గ్రుచ్చె కిన్నెరా

వడగళ్ళతో వచ్చిపడె వానకాలమ్ము
పుడమి పచ్చికలతో పొంగెను సస్యమ్ము
సతిగుట్ల మొయిలులో నుస క్రుమ్మరించిన
అతిప్రేమవాని దేహ మ్మెల్ల నిండగా
సుడిసింది కిన్నెరా అందాలు
తడిసింది కిన్నెరా

నలగఁగొట్టిన పంగనామాల చెరకులో
నలిబూరెరంగుపానకము జారినయట్లు
పడిచింది కిన్నెరా నల్లనై
నడచింది కిన్నెరా

అంచరెక్కలతోడ నరుగువెంచె శరత్తు
పంచలంమున తెల్లుపడె కొంచెము సరిత్తు
మొదలిపొంగులు పోయి పోనుపో స్వచ్ఛమై
తేరుకొన్న మనోహారుని ప్రేమపోలిక
కదిలింది కిన్నెరా కెరటాలు
మెదిలింది కిన్నెరా

బంగారుతీగలో పానకమ్ము రుచిలోతె
మరియు చిక్కనగాక మరియు పల్చనగాక
తరలింది కిన్నెరా సంద్రం
గురలింది కిన్నెరా

దిశదిశల్ మంచులో తేలించుకొనె కారు
తెల్లనై తరగలు తేలించుకొనె నేల
రాణివాసము పల్చు రమణి మేల్ముసుగులో,
వెండితీగవితాన వెలిగిపో మొదుసల్లు
వెలిగింది కిన్నెరా దారిలో
మలగింది కిన్నెరా

శైవాభిషేకరంజన్నారికేళగ
ర్భాంబువుల్ వాకలై అడవి పారినయట్లు
కదిలింది కిన్నెరా ముత్యాలు
నదలింది కిన్నెరా

శిశిరాగమము వచ్చి చెట్లమాకులు దూసె
ముసలులై జంతువుల ముంచుమని కన్మూసె
పతిప్రేమ మారాడి బహుగా ననుభవించి
పొలతిదేహ మ్మెల్ల ముడుతల్లు పడ్డట్లు
పొలిచింది కిన్నెరా నిలుకడల్.
వలచింది కిన్నెరా

రాలిమోడినయాకు కోలిపడి నీరముల్
మాగి మొగ్రిని క్రొత్తనునుపు కాలువయట్లు
తోచింది కిన్నెరా మొగ్రినై
మేచింది కిన్నెరా

ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా
కారు కారున మారు కాంతిలో కిన్నెరా
తెలుగు సత్కవిరాజసులు కనుకోలేని
చవులూరి చవులూరి జలమ్ముల్ల సోప్రత్రై
కదిలేను కిన్నెరా
సాగేను కిన్నెరా

తెలుగునైనమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతనిదర్శనము చేసేత్రోవ
కాచింది కిన్నెరా
తెలుగుయాత్రికుల కందిచ్చు చల్లనినీడ
పుణ్యాత్మ కిన్నెరా
తెలుగుయాత్రికుల కందిచ్చు చల్లనినీరు
పూతాత్మ కిన్నెరా
తెలుగునైనమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతనిదర్శనము చేసేత్రోవ
కాచింది కిన్నెరా

# కోకిలమ్మ పెళ్లి

లేతబుర్రిలు కొక్కిరిస్తే
అత్తగాళ్ళతో యేమిగాని
తాతతాతలనాటి కతలూ
తవ్వీపోస్తానోయ్!

ఊగులాడే కడలితరగలు
నాగుబాములకోడెలల్లే
ఒడ్డుదాకా పారికిపారికీ
ఒరిగిపోతా యోయ్!

ఒడ్డుదాకా అడివి, అడివిలో
దొడ్డచెట్లున్నాయి తరగల
వూగులాడే గాలిచేత
వూగుతుంటాయోయ్!

అడవిలోనూ కడలిలోనూ
అదరాతిరి వేళ అప్పుడు
తొగరుకన్నెల చుక్కకన్నెలు
తొంగిచూస్తారోయ్!

పొద్దుకూకే వేళ వాడున
ముద్దు ముద్దుగ తిరుగుతూంటూ

సొగసునడకల గాలిపిల్లలు
సోకుపోతారోయ్!

సుళ్లు తిరిగే కడలినడుమా
చూపు కందీఅందకుండా
తెప్పలేసుకు పాముపడుచులు
తేలిపోతారోయ్!

ఒడ్డునే బంగారుచేలూ
ఒడ్డునే పూవుల్లుచేతో
ఊరికే యిల్లంటెచాల్ పా
లుబికిపోతాయోయ్!

*　　　*　　　*

నేను చెప్పేకతలు జరిగి
యెన్నినాళ్ళయ్యిందో అప్పుడు
మలలు పొదలూ కొండకోనలు
తెలుగునాడంతా!

కడలివొడ్డున పల్లె వొక్కటి
కలదు, పే డున్నాదు దానికే,
అప్పటికె యీ తెలుగు లంతా
గొప్ప మొకిమీళ్లా!

వెదురులో ముత్యాలపేరులు
కదురులో దారాలబట్టలు
ఎదురుగా నెలపొడిచినట్లే
ఏపుమీరేనోయ్!

దొడదొర, అతగాడినేలలో
ఎడ్డెపనులే చేయ రెవ్వరు,
దొంగనాగరికతలో దేశం
తూలిపోలేదోయ్!

ఉన్నవాళ్ళకు ఎంతనేలా
దున్నుకుంటే చాలుతుందో
మించి ముట్టుకూడ పైనా
చిన్న చెక్కయినా

మిగిలినా అడవ్వాలు, కొండల
కెగురుతూ, మబ్బూల కన్నెల
తగులుతూ, తరిలోన నాసలు
కురుస్తుంటాయోయ్!

అందరికి కావలసినంతా
వుంది, యెవ్వరితోడ నెవరికి
నెన్నడూ చూడలేమన్నా
చిన్ని తగవైనా!

ఆ దొరకి కూతుళ్ళు ఇద్దరు,
మొగ్గలు పూశాయి పెదవులు,
వారి పేరులు, చిలకతల్లీ,
కోకిలమ్మాన్నూ

కోకిలమ్మ నల్లనిదీ
చిలకతల్లీ పచ్చనిదీ
చిలకతల్లికి కోకిలమ్మకు
ఎప్పుడూ పడదూ

చిలకతల్లీ చిన్ననాడే
పలుకనొదలెట్టింది ముద్దుల
మొలకలై తండ్రికీ మేనూ
పులకరించిందీ

ఎన్నో యేళ్లూ వచ్చినాయీ
కన్ను లింతగ తెరచినాదీ
పాప మేమో! కోకిలమ్మకు
మాటలే రావూ

చిలకతల్లికి రంగురంగుల
చీరలూ తెస్తాడు తండ్రీ,
కోకిలమ్మను ఊరకే నే
కోపపడతాడూ

చిలకతల్లి నవ్విపోతే
తండ్రి మారూ పలుకకుంటే
తల్లి వంకా చూచి కోకిల
తెల్లపోతుంది

చిలకతల్లీ వెక్కిరిస్తే
తండ్రి నవ్వి కసురుకుంటే
తల్లి వెనుకా దాగిపోతూ
తల్లడిలుతుందీ

తల్లి యేమీ చెయ్యలేకా
తాను కూడా విసుక్కుంటే
కోకిలమ్మా లోనె లోనే
కుమిలిపోతుందీ

రోజు రోజూ కడలితరగల
రొదలలో కలసి యేడుస్తూ
నురుసులోపల వట్టిచూపులు
నిలిపి పోతుందీ

అడవిలో రేమో చెట్టుకిందో
అంత యెగ్గూ తలచుకోనీ
కూరుచున్నది కూరుచుండే
కుంగిపోతుందీ

చెట్లకోనో పుట్లకోనో
చెప్పుకుందా మన్నగానీ
ఎట్టిచావో వాడు నోరూ
పెట్టలేదాయె

కొండవాగుల్లోను పొద్దూ
గూకులూ కూర్చుండి యిసకలా
గూళ్ళులేని పిచ్చికలకీ
గూళ్ళు కడుతుందీ

కొండవాగులవెంట పోతూ
కొండపువ్వులవంక చూస్తూ
ఎంత పొద్దోయినా గానీ
యింటికే పోదూ

ఒకొక్కప్పుడు తెల్లవారు
అడవిలోనే వుండిపోతే
తల్లి ఊరక తెల్లవార్లూ
తల్లడిలుతుందీ

* * * *

వానరోజులు వచ్చిపోగా
చలిపగళ్ళు సాగిపోగా

ఆకురాలుట ఆగి చివురులు
జోకతాల్చాయీ

చివురులూ కొమ్మలాచివరా
గుబురులై గుబురులాచివరా
పూవులూ నాలుగూవైపుల
బుగులుకొన్నాయీ

చివురులో యీనెల్లై, పసిరిక
పూవుల్లో తేనెల్లై, పలపల
చిలకతల్లికి కోకిలమ్మకు
వయసు వచ్చింది

చిలకతల్లీ చదువు చూచీ
చిలకతల్లీ సొగసు చూచీ
గాలిపిల్లలుకూడ లోపల
కలతపడ్డారూ

చిలకతల్లీ అంద మంతా
చిందిపోయీ అన్నివైపుల
కనులచూడని వారుకూడా
అనుకునేవారే

చెట్లరాణీ తలాడిస్తూ
చిలకతల్లీ నాసుకతలే
నింగిలో దవ్వాన మెచ్చటో
పొంగి పాడిందీ

పొద్దుకూకే వేళ తిరుగుతు
ముద్దు లొలికే గాలిపిల్లలు
చిలకతల్లీ అంద మెచ్చాదు
నాలకపోస్తారూ

ఎల్ల వారూ చిలకతల్లి నె
పెళ్లికై కోరారు, తండ్రీ
తల్లి మాత్రము పిల్లదాన్ని
కళ్ల కాస్తారూ

కడలిఅడవులకొండ్లు తమలో
కలుపుకుంటూ రేమొ అనుకుని
గడపదాటీ చిలకతల్లిని
కదలిపోనీరూ

ఇంటిముంగిలి దాటనీకా
ఇంటిపనులూ చేయనీకా
కంటికీ రెప్పాకిమల్లే
కాచుకుంటారూ

చిలకతల్లీసొగసువాకలు
చిలపలై పలపలై యంపపు
మొలకలై తేనెలాచినుకులు
గలపరించాయూ

చిలకతల్లీ అంద మేమో
చిలకతల్లీ పెళ్ళి యేమో
తల్లి తండ్రీ కోకిలమ్మను
తలచనే పోరూ

* * *

ఒక్కమధ్యాహ్నంబునందున
చెక్కులను కుండలప్రభ లవి
పిక్కటిల బ్రాహ్మణుం డొక్కరు
డక్కడికి వచ్చెఁ

చిలకతల్లీ తల్లిదండ్రులు
చేరవచ్చిన అతనికోసము
కోరినట్టివి యన్ని ఇచ్చి
ఆదరించారూ

వేదపనసలు చెప్పుకుంభూ
వాదములకూ కాలు త్రివ్వుచు

ఆయనా తెలుగురాజింట్లో
ఆగివున్నాడూ

అతని వేషభ్యాషలు వింఘూ
అతని వర్ఛస్సంత కంచూ
చిలకతల్లీ అతని తనలో
నిలిపివేశింసే

సంగతంతా తెలిసిఛేడూ
పొంగిపోయాడేమొ కాని
తల్లికీ చిలకతల్లంటే
వెళ్ళుకొచ్చిందీ

* * *

కోనలందూ అడవులందూ
కోకిలమ్మా తిరుగుతోందీ
ఎంత యేడుస్తోందో తల్లి
యింటికే రాదూ

ఏ మొఖుంగని నేలనాడో
యింటికొస్తే వాడిమీదా
చిలకతల్లీ వలపు తానూ
నిలిపివేశిందీ

కోకిలమ్మా యింటికైనా
రాక అడవుల్లోనె తిరుగుతు
పోకిళ్ళ మారైంది, తల్లికి
కాకపోయిందీ

అడవులెంటా కోనవెంటా
బుడబుడా చను సెలలవెంటా
అడుగుంటా తడబడా వెదుకుతు
నడచిపోయిందీ

రెండుజాముల వేళ పులులూ
పండుకొని రొప్పేటి నీడల
గుండె గుబగుబలాడ పోయీ
కూతు వెదికిందీ

పెద్దపులులు సివంగులూ ద
ప్పికలు తీరగ నీరు త్రాగే
దొంగతోవల సెలమొనళ్ళ
తొంగిచూశిందీ

అడవిమెకములు తిరుగులాడే
ఎడము లేనీ అడుగులొప్పే
అడవిలోపలికోన లెల్లా
తడివిచూశిందీ

పెద్దపులులనుకూడ చంపి
పీల్చి పిప్పిగ చేసివేసే
అడవికుక్కలు పారికులాడే
కదలు చూశిందీ

తోళ్లనూ తిని కొండసిలువలు
కళ్లు మూసుకు నిదరపోయే
బిల్లుడడవిలో ప్రుస్సు వంటూ
వెళ్లిచూశించి

ఎచట పోయీ వెదకినానూ
ఎందు లేదూ కోకిలమ్మా
ఎచ్చటుందో తల్లిగుండే
విచ్చిపోయింది

ఒక్కసెలయేట్లోకి వేరూ
మిక్కిలీపోయినా ముపినీ
ప్రక్కచెట్లకింద కూర్చుని
సుక్కిపోయిందీ

తల్లి వెనకా యింతసేపూ
మెల్లగా వస్తోంది కోకిల
తల్లిబాధా కళ్లచూశీ
గొల్లు మన్నాదీ

ఉరుములా వురిమింది కోకిల
మెరుపులా మెరిసింది కోకిల
వొక్కగంతున తల్లివొళ్ళో
వొచ్చిపడ్డాదీ

తల్లి బిడ్డను బిడ్డ తల్లిని
కళ్ళు మూసుకు కౌగిలించి
ఒళ్ళుతెలియక చెట్టుమొదటా
ఒరిగిపోయారూ

ఒరిగిపోయిన తల్లి బిడ్డా
ఒరిగినట్లే అయిరిగాసి
ఒక్కరైనా లేచి కళ్ళా
తెరవనేలేదూ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
మెల్లగా పాడింది అడివిలో
పిల్ల సెలయేరూ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
కానలోనీ తీగలన్నీ
కదలులాడాయీ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండాలంటూ
గాలిపిల్లలు వెదురులో రా
గాలు తీశారూ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండాలంటూ
ప్రకృతిదేవి వాళ్ళు తెలియక
పాట పాడించి

ఎప్పుడూ గిలకల్లె అడవింగా
ఎచట చూసే అచటవుండే
చిన్నికోకిల లేక అడివి
చిన్నబోయిందీ

కోకిలమ్మా తానమాడని
కోకిలమ్మా పుక్కిలించని
అడవిలోపలి వూటయేటికి
అందమే లేదూ

కోకిలమ్మా చివురుకోయని
కోకిలమ్మా పూలుతురుమని
అడవిలోపలి చిన్న చెట్లకు
అందమే లేదూ

కోకిలమ్మా తిరుగులాడని
కోకిలమ్మా లేని అడవీ
కోనలను తొలుకారుటందం
కొరతపడ్డాదీ

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళగొట్టిన కోకిలమ్మను
చావు లేదని మావిచిగురూ
సాగులాడిందీ

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళగొట్టినకోకిలమ్మా
మునిగిపోదని అడవిపాటా
ముర్మురించిందీ

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళగొట్టిన కోకిలమ్మా
బ్రతికి వస్తుందంచు అడివి
పాటపాడిందీ

పొద్దుకూకే వేళ వెన్నెల
ముద్దుగా కాసింది జాబిలి,
చావు లేనేలేదు ప్రేమకి
చావు లేదందీ

వానలన్నీ వెనుకపట్టీ
కోనలన్నీ నీరువట్టీ
ఆకురాలే కాదుకూడా
ఆగిపోయింది

చిన్న మొగమున కుంకుమిడినా
కన్నె పేరంటాలి మల్లే
చెలువుగా అడినంత కొత్తగా
చివురు తొడిగిందీ

గోదుమావన్నె త్రాచల్లే
కొబ్బరిపాలల్లె అడవి
చిన్నిప్రాటా వొదిగి వొదిగీ.
చెన్ను వొలికిందీ

ఎక్కడో అడవిలో చివరా
చక్కగా సన్నగా యేదో
చిక్కనైనా తేనెపాటా
జీరు వారిందీ

ఆపాట వింటూనె అడివి
అడివిగా నిలువెల్ల, పోయిన
వొక్కచుట్టం వచ్చినట్లూ
పులికిపడ్డాదీ

సన్నగా పోతున్నప్రాటా
జాలు జాలింతై వెడల్పై
పట్టలేకా ఓకప్పు జలజల
పసువులై తిరిందీ

కోకిలమ్మా అనుగో మళ్ళీ
కూసెనంటే కూసెనానీ
వచ్చెనంటే వచ్చెనానీ
బ్రతికెనంటే బ్రతికెనానీ

ఒళ్ళు తెలియక అడవిప్రాటా
జారి పోయిందీ
చెమ్మ తరగని మావిమోకా
చివురు తొడిగిందీ

అంతలోపల నడవి కందం
అతిశయించిందీ

*  *  *

అంతలో పూవుల్ల రేడూ
వింతవింతల సోకు లేలిక
చెక్కులా నవ్వ్వాలు చిలుకుతూ
చేరవచ్చాడూ

ఏడాది కొకసారి వస్తా
డేడాది కొకసారి తెస్తా
పొన్నిపువ్వులు, అతసివేనూ
వన్నెలూ చిన్నెల్

వచ్చావటయ్యా పూలతేడా,
తెచ్చావటయ్యా పూలరాజా,
నీవు తెచ్చిన పూవులే కా
నికల కిస్తామూ

కోకిలమ్మను ముద్దుపెళ్ళి
కూతురును చేస్తాము, పెళ్ళి
కొడుకునూ చేస్తాము నిన్నూ,
కూర్చి వేస్తామూ

కోరి నీ అందానికీ మా
కోకిలమ్మా గొంతుకునకూ,
సొగసు చేతా పాట చేతా
నాగేపోయిందీ

రావయ్యా ఓ పూలరాజా
రావయ్యా ఓ అందగాడా
కోకిలమ్మకు నీవు, నీకూ
కోకిలా తగునూ

వారిపెళ్ళికి అడవి అంతా
తోరణాలైనాయి చివురులు
కాపలా కాసినై పులులూ
గండశిలలందూ

సన్నాయి పాడింది తెల్లని
సన్ననీ సెలవ్రాట పూలా
వెన్నెలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరిచిందీ

పూలసోనలు కురిసినై, తే
నేలపాటలు విరిసినై, అం
దాల త్రోవలు వెలిసినై, రాజ
నాలు పండినవి

చిలకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతికవాక్కులు
కోకిలమ్మా తెనుగుపలుకూ
కూడబెట్టిందీ



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RCHBO2R[illegible]31 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 23/3/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 8A, 80B, 32A, 90A, 90Am |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | rakshitha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |